శ్రీరస్తు.

# శ్రీ ర మా మ నో హ ర శ త క ము.

యిది

జాడిచేటి నారాయణరావు

రచియింపబడినది.

ల క్క వ ర ము

ఏలూరు, రామా ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

---

1924.

 [వెల 0-2-0.

# పీఠిక.



ఆర్యులారా! నేను విశేషజ్ఞుడనుగాకున్నను. విశేషజ్ఞుల పరిచయము వలనను, విశేషగ్రంథపఠనము వలనను, నాకొక శతకంబు వ్రాయ నూహ గలిగి నాకు నేనె యీయూహ సరికాదని మరల్చుకొని తిరిగి (ప్రారంభరహితంబౌంచు నారాయణసంపదలు) అనునుడి జ్ఞప్తికివచ్చి నీయుద్యమము ప్రారంభించి మాత్రమని మొదలిడి కొన్ని పద్యంబుల వ్రాయ వానిని మాగ్రామనివాసులును నామిత్రులగు సరసాగ్రగణ్యులును హరిభక్తిపూరితులును, పరమార్థతత్త్వజ్ఞులును ధర్మైకచిత్తులునగు వంగపల్లి నాగలింగముగారు శ్రీకాకొళ్ళ సంపూర్ణముగ నీపద్యంబుల నాలకించి యందలి భక్తి ప్రాధాన్యమున నీశతకంబు త్వరితముగ బూర్తిగావించిన శ్రేయస్కరమని నన్ను మిక్కిలి ప్రోత్సాహపరచి నీయది వాటి పూర్తిచేయించి ముద్రింప దొడగించినందులకు వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

మరియు నీయది నాకు ప్రథమోద్యమం బగుటచేత తప్పులు తప్పులై యుండనొప్పు. వాటిని త్యజించి హంసనీరంబులవీడి క్షీరంబులగొను తెరంగున గుణగ్రహణ పారీణులుగా వేడెద. మరియు నీశతకమును సవరించుటలో నాకుతోడ్పడి శ్రమకు జంకక నీయది పూర్తి పరిపించినందులకు మద్గురువగులగు బ్రహ్మశ్రీ పుల్లాభొట్ల వేంకటసుబ్బారాయుడుగారికి అభినందనం బొనర్చెద. స్ఖాలిత్యంబు లున్నచో దెల్పిన ఆనందించి ముందు ముద్రణంబున సవరించుకొనెదను.

లక్కవరము,
ది 5-4-1924.

ఇట్లు విద్వజ్జనవిధేయుడు,
గాడిచేటి నారాయణరావు.

సీ. శ్రీలక్కవరమున ♦ శ్రీలజెన్నారెడు
వందనపాన్వయ వార్ధియందు
చంద్రుడై బొడమిన ♦ సాంద్రయశోరాశి
రుక్కయాఖ్యుండునా ♦ రూఢిజెలగ
నాతని కొమరులై ♦ నవనిరామన్నయు
రుక్కయ్యయను నిర్వు ♦ రక్కజముగ
నుద్భవింపగనందు ♦ నుర్విప్రసిద్ధుడై
పేరమాంబనుతన ♦ ప్రియసతినిగ
జేకొనిరామన్న ♦ చెలువుగా నల్వుర
సుతులను నిర్వుర ♦ సుందరీల
గాంచె నానల్వుర ♦ ఘనఖ్యాతినొందిన
నారుక్కయాఖ్యుని ♦ నాత్మజులుగ
నయగుణశాలియే ♦ నాగలింగంబును
రామబ్రహ్మాఖ్యను ♦ రహిజెలంగు

సుగుణవంతుండగు ♦ సూర్యప్రకాశంబు
వీర వెంకటార్యు ♦ వేడ్కమీర
కూతుల నిర్వుర ♦ ప్రీతినాగాంబనా
కాంతామణిన్గాని ♦ గాంచె భువిని
నందురామబ్రహ్మ ♦ మగ్రజునకుక ర్త
తనుజేసె భువిదివి ♦ తనియగాను
సీపద్యశతకంబు ♦ సీతోంచిభక్తితో
ముద్రణంబొనరించె ♦ ముక్తికొరకు

తే. గీ. గాన శ్రీపతికృపచేత ♦ గల్లుగాత
నెల్లసంపదలును ధర ♦ నెల్లసుఖము
లల్లుకొనియుండువీరల ♦ యన్వయమున
భువిని నాచంద్రతారార్క ♦ ముగను చాల.

———



శుభమస్తు.   శ్రీ   అవిఘ్నమస్తు.

# రమామనోహరశతకము



ఉ. శ్రీయుతమూర్తి భక్తజన ♦ చిత్తవిహారి కృపాంతరంగ నా
రాయణ వాసుదేవ రఘు ♦ రామ ఫణీంద్రశయాన మాధవా
తోయజనేత్ర భూభరణ ♦ దోషవిదూర ఖగేంద్రవాహనా
ధీయుత దుష్టభంజన సు ♦ ధీజనపాల రమామనోహరా. 1

చ. గణపతిదొల్తగొల్తు నిది ♦ గౌరవమొప్పగ పూర్తిజేయ ధా
రుణిగల వైదుషీమణి గు ♦ రూత్తములన్ నుతియింతు సంతతం
బణువును బ్రహ్మయంతరము ♦ నావృతమయ్యెడు మాతగొల్తు నే
క్షణమును నాదుచిత్తమున ♦ సంతసమొప్ప రమామనోహరా. 2

చ. యతులను ప్రాసలెంచక య ♦ హర్నిశమున్ పదజాలమేరుచున్
గతులనుదప్పుచున్ రసము ♦ కల్పనజేయుట చేతగాక యే
గతినోపదాళిగూర్చి పద ♦ కావ్యములన్ నిరసించుచుండు నీ
క్షితి కుకవీంద్రవందనము ♦ జేయనుసూవె రమామనోహరా. 3
ఉ. ఓశుభమూర్తి దోసముల ♦ నోముదువంచు మదీయచిత్తమందా
శవహించి యీశతక ♦ మంతయు వ్రాయగబూనినాడ నో
కేశవరామచంద్ర పరి ♦ కించు దయామతిపూర్తిగాగ స
ర్వేశ మురారి చక్రధర ♦ వేడెదశౌరి రమామనోహరా. 4
చ. చదువగలేదు శాస్త్రముల ♦ శబ్దములన్దెలియంగలేదు నా
మది నిసుమంతభీతి యను ♦ మానములేకను జెప్పుచున్న నీ
కుదరనికై తమందు పలు ♦ కోటులు తప్పులు నిండియుండినన్
మదనునితండ్రి యొప్పులుగ ♦ మార్చిక్షమింపు రమామనోహరా. 5
ఉ. ఈదినమాది నీస్మరణ ♦ నేవిధి జేతునటంచు నెంచి యీ
మాదిరిగాను పద్దెముల ♦ మానక చెప్పెదు నాదుకైతమున్

గాదనియెంచి పీడకను ♦ కల్పనజేయ సుశబ్దజాలముఁ
వేదయనిచ్చి భక్తునియ ♦ భీష్టముదీర్చు రమామనోహరా. 6

ఉ. ఘోరునిగన్నతండ్రి నిను ♦ మానసమందుననమ్మి కబ్బపుఁ
ధోరణి సంస్తుతుల్సలుప ♦ దుర్భ్రమయం చెడ నెన్నకుండ స
ద్ధీరుల సాయమున్బడక ♦ దీనిని జెప్పచునుంటి కేశవా
భూరమణీమణీప్రియుడ ♦ భోగిశయాన రమామనోహరా. 7

ఉ. బింకముతోడ నాదనుజు ♦ పిచమడంపగ బూని వేగమే
పొంకముగాను మత్స్యమయి ♦ పుట్టి జలంబున దుష్టసోమకున్
శంకయొకింత లేక తన ♦ శక్తినిజూపుచు నొక్కపట్టునన్
జంకును లేక చంపితివి ♦ సాహసమొప్ప రమామనోహరా. 8

చ. ఎటులను బాధసైతుమిక ♦ నెవ్వరు దిక్కని వేల్పులందరుఁ
కటకట యేమిచేయుదుము ♦ గావుమటంచును మొర్రవెట్టనం
తటదయకూర్మమూర్తివయి ♦ దాటిగ పర్వత రాజమంబుధిన్
చిటికెనవ్రేల నెత్తితివి ♦ చింతలుదీరరమామనోహరా. 9

ఉ. క్రూరుడు కాంచనాక్షుడటు ♦ కుత్సితబుద్ధిని భూమినంతయున్
ధీరత జాపజుట్టి వడి ♦ దెచ్చియు దాగొనియుండి నంతనా
ఘోరుని రూపుమాపుటకు ♦ సూకరమైధరాగ్రవ్యాదుష్టునిన్
శూరతజూపి జంపితివి ♦ సోకులగొంగ రమామనోహరా. 10
చ. హరి హరియంచు నెల్లపుడ ♦ హర్నిశముల్ భవదీయనామమున్
స్మరణనుజేయు బాలకుని ♦ చాలగ బాధలుపెట్టుచుండి న
త్కరుణ రవింత లేక బహు ♦ కష్టను బల్కు హిరణ్యకశ్యపున్
ఘోరనృశింహమై దునిమి ♦ బ్రోవవె బాలురమామనోహరా. 11
ఉ. భూతలమందు నాయదితి ♦ పుత్రుడవై జనియించి గుజ్జువై
దాతలు వేరువేరుమరి ♦ దానవులందున నాకు మిక్కిలిన్
చేతమునందు గర్వమును ♦ జెందెడి యాబలిమెట్టుబెట్టితీ
వాతరిపామనారవికు ♦ లాంబుధిసోమరమామనోహరా. 12
ఉ. రాముడవై జనించి యిల ♦ రాజుల నందరిలోన ముఖ్యుడున్
భీముని బోలగాదగిన ♦ వీరుడు ధీరుడు కార్తవీర్యునిన్

నామము వంశమంతయును ♦ నాశనమున్ బొనరించినావు నీ
ప్రేమను జూపి భక్తులను ♦ పీడకు శౌరిరమామనోహరా. 13
చ. హాలమునుబూని దుష్టులను ♦ హంతయొనర్పగ కృష్ణుతోడ నీ
యిలజనియించి యాఖలుల ♦ నెల్లనొకమ్మడి మట్టుబెట్టి నీ
బలమును జూపలేదె మది ♦ బాయక వేడెద నన్నుగావుమో
బలముగలట్టి రామయరి ♦ భంజనశౌరి రమామనోహరా. 14
ఉ. కావరమూని రావణుడు ♦ కష్టములెన్నియొ గల్గజేయ నా
దేవతలెల్ల నీదరిని ♦ దీనతచే మొరవెట్ట వేగమా
రావణుజంపరాముడన ♦ రాజకులంబున బుట్టిజంపలే
దే వనమాలి సూర్యకుల ♦ దీపప్రతాప రమామనోహరా. 15
చ. చెలియలు నిన్నుగోర తన ♦ చిత్తమునందున ద్వాపరంబునన్
కలియుగమందు బుద్ధతను ♦ గైకొననానని జెప్పి యాడటన్
చెలి యుగనాసుభద్రతవ ♦ చేతమెలర్పగగొన్నసామి నే
డలచెద నిన్నుబుద్ధుడన ♦ ధారుణిలోన రమామనోహరా. 16

చ. కలియుగమందు దుష్టులను ♦ ఖండనజేసియు సాధుకోటినిఁ
నిలుపుచు కల్కిమూర్తివయి ♦ నేరములెల్లను బారదోలగా
వెలయుదువంచు నెంచెద శ్రీ ♦ విక్రమ నన్దయజూడుమయ్య నే
నలిపెద నీదుసంస్మరణ ♦ సారసనేత్ర రమామనోహరా. 17
చ. సిరిచెలికాడ వైరిజన ♦ చిత్తభయంకర పద్మనేత్రు డా
తరుణి యహల్యరక్షక గ ♦ దాధర రామ మురారి శౌరి భా
స్కరకులవంశసోమ రణ ♦ కౌశలభీమ వరాహవేష శ్రీ
హరి కరుణాంతరంగ దను ♦ జాంతకనామ రమామనోహరా. 18
ఉ. పాతకమెంతో జేసితిని ♦ బాల్యమునుండియు దానినెల్ల నీ
చేతమునందు నెంచకను ♦ జేరగదీయుము నీదుచెంతకుఁ
రాతిని నాతిగాసలిపి ♦ రక్షణజేయగ లేదెతొల్లి న
న్నీతరిబ్రోవభారమొకో ♦ యెంతయుప్రేమ రమామనోహరా. 19
ఉ. పక్షికిముక్తినిచ్చిపగ ♦ వాడగు రావణుజంప వారిధిఁ
తక్షణమందుదాటి తమ ♦ దర్శనమందిన నవ్విభీషణుఁ

రక్షణజేసి రావణు ధ ♦ రాతలమందున గూల్చు రేడవే
మోక్షమునిచ్చి బ్రోవుమిదె ♦ మ్రొక్కుచునుంటి రమామనోహరా.

ఉ. కన్నులుగాన కెంతొ కడు ♦ గర్వము నన్ముని జేయుచున్నయా
జన్నము విఘ్నమున్సలుప ♦ సాహసులైన సుబాహుసంతతిన్
పిన్నతనంబునందె నిల ♦ పేరును నూరును లేక ద్రుంచినన్
జన్నమునాగి కౌశికుడు ♦ సంతతమందె రమామనోహరా 21

చ. మురళినిగానమున్సలుపు ♦ మూర్తి సురాసుర చక్రవర్తికి
న్నరపతి దానవాంతక ఘ ♦ నాఘనకాంతి శరీరమూర్తి శ్రీ
కరమగు శంఖుచక్రములు ♦ గల్గుగదా ధరగానలోల యో
నరహరిశౌరి మాధవ జ ♦ నార్దననీవె రమామనోహరా. 22

చ. జనకుడు నామహేశ్వరుని ♦ చాపము నెక్కిడినట్టివారికిన్
జనకజనిత్తునంచనిన ♦ సంతసమందుచు రాజులందరున్
గనుగొనుచుండ కార్ముకము ♦ కౌశలమొప్పగవంచి సత్వరం
బున యశమొందభూమిజను ♦ బొందగలేదె రమామనోహరా. 23

చ. నరకుడు స్వర్గనాయకుని ♦ నాకమునుండియు బారదోలగా
నరగున నేగుదెంచి జల ♦ జాక్షుడగావుమటంచు నిందు్రిడున్
సురులును మొఱ్ఱ వెట్టగను ♦ శోకము మానుడటంచు జెప్పి ని
గ్జరులటు మోదమందగను ♦ జంపితి చక్రము బంపిదానవున్
శరనిపుణత్వ మూర్తి వన ♦ జాక్షయుపేంద్రరమామనోహరా.24

ఉ. పక్షముచేత నేరుపున ♦ శాధలుపెట్టి రణంబునందునన్
కక్షనుబూని ధాత్రి నల ♦ కౌరవులన్ప్బలియింపజేసి సం
రక్షణజేసినాడవను ♦ రాగము జూపుచు పాండవేయులన్
పక్షితురంగదైత్యకుల ♦ వైరి మురారి రమామనోహరా. 25

ఉ. వ్యక్తతలేక సల్పితి న ♦ యాకడు దోసములెన్ని యేనియున్
ముక్తియు భుక్తియుః నలుగు ♦ భూమినిసంస్మరియింప నిన్ను నీ
భక్తులకేలరా భయము ♦ బాయకసాకెదు తండ్రి వుండ న
వ్యక్తిని జేసినట్టి దురి ♦ తాళిని ద్రుంపు రమామనోహరా. 26

ఉ. అయ్యవు బ్రోచువాడవని ♦ యాత్మను నమ్మితి నిన్నె యెప్పుడున్
కుయ్యిడుచున్నను న్గనవు ♦ కోరికలీయవదేమి కర్మమో
చెయ్యన నాడునేరముల ♦ నైచి కృపన్గనుమయ్య వేగమో
యయ్యరొబాధల న్గుడప ♦ కయ్యకృపాళొ రమామనోహరా. 27
ఉ. చింతలబాపుమయ్య కడు ♦ శీఘ్రమె దీనులగావుమయ్య నీ
చింతనజేయువారలను ♦ జేరి దయన్గనుమయ్య భక్తులక్
వంతనుగుందజేయగను ♦ భావ్యమ దిక్కెవరయ్య దేవ ర
వ్వంతమనంబునందు దయ ♦ బాయకజూడురమామనోహరా. 28
ఉ. భక్తులగాచువాడవని ♦ బాగుగనమ్మి మనంబునందు నా
శక్తి నొకింతజూడకను ♦ సాహసవృత్తిని కబ్బమెల్ల నీ
భక్తిని వ్రాయుచుంటిని య ♦ పారముదంబున దానవారివే
శక్తునిజేయుకైతమున ♦ శాత్రవవైరి రమామనోహరా. 29
చ. దితిసుతవైరి రామనృప ♦ దేవజనార్దన పార్థసారధీ
రతికిని మామభక్తజన ♦ రంజన కృష్ణ ఖరాసురాంతకా

క్షితిపరిపాల మాసిజన ♦ సేవితపాద పురారి శౌరి మా
రుతిపరిపాలకా కుజన ♦ రూప వినాశ రమామనోహరా. 30

ఉ. చిన్నతనంబునం దెటుల ♦ చేసితినో గద పాపకృత్యముల్
మన్ననజేయుమయ్య తవ ♦ మానసమందు ననుంచకయ్య నీ
కన్నను వేరుదైవమిక ♦ గాంచినలేదు నిజంబుగాదరన్
వెన్నుడశౌరిమాధవ యు ♦ పేంద్రదయాళురమామనోహరా. 31

ఉ. బాలుడవయ్యు నాగిరిని ♦ భారమటంచు దలంచ బోకగ
గ్గోలనుబెట్టు గొల్లలను ♦ గోవులగాచి మహేంద్రు గర్వమున్
ద్రోలగ వేడె దూరముకు ♦ తోయజనేత్ర సదాదలంతు శ్రీ
లోల పరాత్పరాఘునబ ♦ లుండ మురారి రమామనోహరా. 32

ఉ. ముక్కనవంచు నెంచకను ♦ మోదముతో నటుకుల్గ్రహించినా
వెక్కుడు ప్రేమచేత నవి ♦ యెల్లను భక్తకుచేలుడివ్వగా
నిక్కపు భక్తుడంచు మరి ♦ నీ ప్రియమిత్రుడటంచు నంపదల్
పెక్కగనివ్వభూసురున ♦ భీష్టముదీర రమామనోహరా. 33

చ. కరివరదాముకుందనర ♦ కాంతకశౌరి కృపాంతరంగ శ్రీ
హరిగిరిధారి చక్రధర ♦ యచ్యుతమాధవ గానలోల శ్రీ
ధరపురుషోత్తమానిఖల ♦ దానవవైరి పరాత్పరా దయా
కర రఘువీర మన్మధుని ♦ గన్నయుపేంద్ర రమామనోహరా. 34
ఉ. చక్కెరకన్న మిక్కిలి ర ♦ సంబగు మీగడకన్న మంచిపే
రెక్కిన జున్నుకన్న భువి ♦ నెంచగ తీయని తేనెకన్న నే
నిక్కముగాను జెప్పెదను ♦ నీదగు నామమె యెంతో మాధురం
బెక్కువయానుగాదెనిరు ♦ పేదకునైన రమామనోహరా. 35
ఉ. మానసమందు భక్తినిటు ♦ మానక నేరిచి నేర్వకోయిటుల్
బూనినవాడ నీకవిత ♦ పున్నని దోసములున్న దీనిలో
మానకనాకు దెల్పుమను ♦ మాత్రము తప్పులులేక యుండగన్
మానవరాహమూర్తి నిను ♦ మిక్కిలిగొల్తు రమామనోహరా. 36
ఉ. ఎవ్వని మానసంబునను ♦ నెక్కుడుప్రేమజనింప భక్తుడౌ
కవ్వడి నాజిగెల్వగను ♦ గర్వమువోవగ రాజరాజు తా

నిర్వ్వారగందజేసెనో కో ♦ నిశ్చలప్రేమ కుచేలు లేమినిన్
దవ్వగజేసెనో యతడు ♦ దల్పగ నీవె రమామనోహరా. 37

చ. మకరి గజమ్ముపాదమును ♦ మానకబట్టుక బాధనొందజే
యకరికి భీతిగల్గి మన ♦ మారనిదుఃఖము నొందియుండినే
నిక మతజాలగావుమని ♦ నేడ్వగ చక్రముబంపి క్రూరమా
మకరిని జంపి గాచితివి ♦ మాధవశౌరి రమామనోహరా. 38

ఉ. ఆవసుదేవ దేవకికి ♦ నందముగా జనియించి కంసునిన్
చేవనుజూపి జంపితివి ♦ శ్రీధరశక్యమె నీదు మాయలన్
దేవ యెఱుంగజాలమయు ♦ దీనులునై మొరబెట్టు భక్తులన్
గావుము పక్షివాహనుడ ♦ కాంచనచేల రమామనోహరా. 39

ఉ. ఓవసుదేవపుత్ర సుగు ♦ ణోత్తమ కంజదళాక్ష వామనా
శ్రీవరదానవారిగణ ♦ సేవితపాద సరోజయుగ్మ యో
పావనిపాలనా సుజన ♦ భంజన పాపవిమోచనాహ్వయా
రావె మొరాలకింపవె ము ♦ రారిస్మరింతు రమామనోహరా. 40

చ. తరగనిపాపకృత్యముల ♦ ధారుణిజేసిన క్రూరుడైన తా
విరివిగ దానధర్మములు ♦ వేడుకజేయని లోభియైన నిర్
నిరతము భక్తిసంస్మరణ ♦ నిశ్చలబుద్ధిని జేయుచుండగా
దరికిని జేరగాగలడె ♦ దండధరుండు రమామనోహరా. 41

చ. ఎరుగకజేయు పాపముల ♦ నెన్నియు నేగనలేనునుంత భా
స్కరకొమరుండుబెట్టు పలు ♦ కష్టములందున ద్రోయకయ్య శ్రీ
ధర నినుసర్వకాలముల తండ్రివటంచును నమ్మిగొల్చెదన్
మరవనుసుమ్మి యెల్లపుడు ♦ మాధవశౌరి రమామనోహరా. 42

ఉ. కావుముభక్తసంతతిని ♦ గావుము దీనులగావుమయ్య నే
నేవియొ దోసముల్సలుప ♦ నీర్ష్యవహింపక జూడుమయ్య నా
భావమునందు చింతలను ♦ బారగదోలుము శౌరి మాధవా
పూవిలుకానితండ్రి యదు ♦ పుంగవ కృష్ణ రమామనోహరా. 43

ఉ. కాయము శాశ్వతంబనుచు ♦ కాముకులై జరియింత్రుగానినీ
మాయనుదాటు మార్గమును ♦ మాత్రము గానగలేరు హీనులై

చేయఁగలేరు నీస్మరణ ♦ జేసెడివారికల వెక్కిరింతురీ
హేయమునైన దేహమది ♦ నెక్కుడటంచు రమామనోహరా. 44

ఉ. సారములేనిదిన్మరియు ♦ సౌఖ్యవిహీనపు జన్మమెంచగా
పారములేని సాగరము ♦ బారలచేతను నీదశక్యమా
వారిరుహాక్ష నీవిమల ♦ పాతసరోజపుటోడ లేక బ్రం
దారక చక్రవర్తినిను ♦ ధ్యానముచేతు రమామనోహరా. 45

ఉ. వారిజపత్రనేత్ర హరి ♦ వామన శ్రీధర పద్మనాభమా
త్రీరణవీర కేశవసు ♦ రేశ సహోదర లోకరక్షకా
శౌరిమురారి మాధవసు ♦ శానసవైరి జనార్దనాధరి
శ్రీరమణాగదాధరసు ♦ ధీజనపాల రమామనోహరా. 46

ఉ. జీవులనెల్లపాత్రలుగ ♦ జేసియు నద్భుత నాటకంబులో
నీవొక సూత్రధారివయి ♦ నేర్పున నాటకశాలగాను నీ
భూవలయంబు నేర్పరచి ♦ బూటకమౌ తెర జేసి లీలగా
నీవిటుసల్పుచున్నకన ♦ నేరముగాదె రమామనోహరా. 47

ఉ. ఎవ్వనిమాయచే జగము ◆ లెల్లనుబుట్టి యడంగుచుండెనో
యెవ్వడు నామరూపక్రియ ◆ హీనుడనంతుడు సర్వసాక్షి తా
నెవ్వడు వాఙ్మనంబులకు ◆ నించుకరైనను జిక్కకుండు నే
నెవ్వడ యట్టి నిన్నుభువి ◆ నేర్పడజెప్ప రమామనోహరా. 48

ఉ. రాగములేనిపాట యను ◆ రాగములేని లతాంగి నేస్తమున్.
సాగని కార్యయత్నమును ◆ సంతసమందని రాజసేవయున్
భోగములేని కష్టమును ◆ పూజయొనర్పని దేవళంబులున్
త్యాగములేని సంపదయు ◆ వ్యర్థముగాదె రమామనోహరా. 49

చ. తనువిదిశాశ్వతంబనుచు ◆ దానము ధర్మము సుంతయేనియున్
కనవినజేయకుండి వెల ◆ కాంతలకుస్ధనమిచ్చుచుందురే
యనలముజూచి పండనిభ ◆ మాతురతన్దినబోవుకీటకం
బునకును గల్గునట్టిగతి ◆ భూమినివారికి గల్గుగాదె యో
వనరుహనేత్రదైత్యకుల ◆ వైరిమురారి రమామనోహరా. 50

మ. ఎవ్వనినామ మెల్లపుడు ◆ నెంతయు భక్తిని సంస్మరింతురో
యెవ్వనిమాయలోకముల ◆ నెల్లనునిండియు వెల్గుచుండెనో
యెవ్వని విశ్వరూపమును ◆ నీక్షణ శేయగ నెంచుచుందురో
యవ్విభువీవె కావె మది ◆ నారయ శౌరి రమామనోహరా. 51

శా. పన్నగశాయి కూర్మిరతతి ◆ భంజన సుందరమూర్తి మారునిగ
గన్నటువంటితండ్రి హరి ◆ కాంచనచేల కుచేలమిత్ర యా
పన్నుల ప్రేమజూచు భగ ◆ వానుడ రాముడ ద్వారకాధిపా
వెన్నెలదొంగ వైరిజన ◆ భీకర శౌరి రమామనోహరా. 52

ఉ. ఆపరమాత్ముడే మనకు ◆ నన్నివిధంబుల దిక్కటంచు నో
శ్రీపతి నీదుచింతనము ◆ జేసెడి భక్తులమీద ప్రేమమున్
జూపుచు వారలన్నముల ◆ జూచియుతీరని పాపజాలమున్
బాపుమటంచు నిన్నిగుల ◆ ప్రార్థన జేతు రమామనోహరా. 53

చ. నరకునిబాధచేత విపి ◆ నంబుల నుండెడు మేనులెల్ల స
త్వరగతి నేగుదెంచియల ◆ దానవుదారుణ కృత్యమెల్లనీ

దరిమొఱబెట్టపుత్రుడని ♦ దల్చక భక్తులగావ చక్రముం
సరగునబంపి రక్కసుని ♦ జంపితిగాదె రమామనోహరా. 54

ఉ. సారములేని క్షేత్రమును ♦ సామజయానయులేనియిల్లు సిం
గారములేని రూపమును ♦ గౌరవముండని రాజసేవయుం
జేరములేని శిక్ష ధర ♦ ణీసురులుండని పట్టణంబు వా
క్స్మారతలేని జన్మమును ♦ జూడగ నేల రమామనోహరా. 55

చ. భవమరణంబులేని ఘన ♦ బాటను గానగలేక మూఢుడై
భువిని సమస్తమున్ననకు ♦ పోనిదటంచును క్రూరకర్ముడై
తవపదభక్తి వీడివని ♦ తాదులయందలి మోహపాశముం
దవిలిమదాంధుడై యముని ♦ దండనఁబొందు రమామనోహరా. 56

ఉ. రాముడ దుష్టరాక్షస వి ♦ రాముడ పూర్ణకళాప్రపూర్ణుడా
కామితసత్ఫలప్రదుడ ♦ కంజదళాక్షుడ కాంచనాంబరా
భీమరణంబు వైరులకు ♦ భీతినిగల్గ జేయు శూరుడా
భూమిజనేత్రకాడరఘు ♦ భూపమురారి రమామనోహరా. 57

చ. తరిగనిపెట్టి బాలురకు ♦ తల్లి సమస్తము నిచ్చుచున్న మా
వరుగడపోరు సుంతయు మ ♦ నంబున భక్తులనట్లు మిక్కిలిన్
కరుణనుబూని యెల్లపుడు ♦ కంటికి రెప్పగ గాచుచుండినన్
మొరలను బెట్టమానరుగ ♦ మోక్షదతండ్రి రమామనోహరా. 58

చ. కలిమియు లేమియున్ స్థిరము ♦ గావనునిశ్చలబుద్ధితోడనిన్
దెలిసిన జ్ఞానులెప్పుడును ♦ దీనతనొందక కామమోహముల్
ఫలితము గోరకుండగను ♦ భావమునందు వివేకదృష్టిచే
పలుమరు నీవె దిక్కనుచు ♦ భక్తినిగొల్తురు రమామనోహరా. 59

చ. మరపున నైన నీస్మరణ ♦ మానని భక్తుడు నీదు సత్కథల్
నిరతము జెప్పుచుండు ధర ♦ నీసురుడన్ తవదాసుడన్ వడిన్
కరుణనుజూడునన్ను నర ♦ కాసురవైరి కొరంతలేకయున్
పరుడ నటంచు నెంచకుము ♦ ప్రార్థనజేతు రమా మనోహరా. 60

చ. తగుననియెంచి యోగతిని ♦ తండ్రివి పుత్రులజూడకుంటివా
వగలనుగుందుభక్తులను ♦ బాయగబోకుము దీనపాలకా

పగమనుమందువీడి దయ ♦ భావముతోడుత గావు సూనునిన్
ఖగపతివాహనా పరుడ ♦ గాను మురారి రమా మనోహరా. 61

ఉ. ఆస్తికభక్తినర్ఘ్యమును ♦ నర్ఘ్యనకప్పు డొసంగుచుండ నీ
హస్తమునందు తమ్మివిడ ♦ నాగయుజంప ప్రతిజ్ఞపట్టి నీ
నేస్తుని పార్థుబోరితుది ♦ నీమనమందలి ప్రేమచే జగ
త్స్తోంస్తుతమూర్తిగాచితివి ♦ సంతసమొప్ప రమా మనోహరా. 62

చ. హరిహరియంచు నిన్నిటుల ♦ నాత్మను నెప్పుడు వీడకుండగా
స్మరణను జేయు భక్తజన ♦ సంఘము నందనురాగముల్ మహా
దరమిటులుంచి కావదగు ♦ దైవమునీవని వేడువారలన్
శరణని వేడు దీనులను ♦ సాకుముతండ్రి రమా మనోహరా. 63

చ. వరములొసంగువాడవని ♦ భక్తిని ప్రార్థనజేయువారి గా
వరఖగవాహనాసుతుల ♦ బాయనిప్రేమను జూచుచుండి దు
ర్భరపరితాపమున్మదిని ♦ బాయకృపఘ్నమయ్యు వేగమో
నరహరిదీనపాలకుడ ♦ నమ్మినవారి రమామనోహరా. 64

ఛ. జ్ఞానము నాగకున్ని శిత ♦ నాగటదున్నియు చిత్తసీమ నా
మాని శిఖామణుల్గలసి ♦ మానసపూజయ నెందు శేద్యమొం
తేనియు జేసి మోహమద ♦ నీర్ష్యలనంబడు కల్పు మొక్కలర్
పూనికతోడ దీసి పరి ♦ పూర్ణమనోఫలితంబు నొంది నీ
స్థానము జేరి రెంతొ మది ♦ సంతస మొప్ప రమామనోహరా. 65

ఉ. వైరము చేత రాక్షసులు ♦ బాంధవులాటను పాండవాదులర్
మారుని గోష్ఠి గోపికలు ♦ మానసపూజను నారదాదులర్
కూరిమితోడ వానరుల ♦ కుంఠితభక్తిని దైత్యబాలుడర్
చేరిరి నీదుసన్నిధిని ♦ శ్రీధర శౌరి రమామనోహరా. 66

ఉ. ఎంగిలి జేసి యా శబరి ♦ యిచ్చినపండ్లను ప్రేమమీరగా
పొంగుచు నారగించితివి భోగిశయానుడ భక్తులన్న నీ
కుంగలదే మహాత్మ్యగన ♦ కొంచమునైనను భేదదృష్టి శ్రీ
రంగనివాస యాత్రజన ♦ రక్షక శౌరి రమామనోహరా. 67

ఉ. ఏయది వెల్గు చీకటుల ♦ కెంతొ యతీతముగా వెలుంగునో
భ్రూయుగమధ్యమందు పరి ♦ పూర్ణకళాన్వితమై వ్యశక్తిచే
నేయదినిండియుండుతన ♦ కెచ్చటసాటిని లేనిదేదియో
యాయది నీవెకావెన ♦ నన్యముగాక రమా మనోహరా. 68

ఉ. శిష్టజనాళిరక్షణము ♦ జెచ్చెరదుష్టుల శిక్షణంబులున్
కష్టముగావు నీకవియె ♦ కార్యములౌటను వేడుచుంటి నా
కష్టములెల్లబాపి దయ ♦ గా చెడికర్తవు నీవటంచు సం
తుష్టినిజెంద మోక్షమిడు ♦ దోషవిదూర రమా మనోహరా. 69

ఉ. పాలను నీరమేర్పరచు ♦ ప్రాజ్ఞతయంచకెగాని కాకికిన్
వీలునుగాని యట్టులయ ♦ భేద్యతరంబగు మాయలోపలన్
లీలగనుండు నిన్నునవ ♦ లీలగ జ్ఞానుడు వేరుజేయువే
ళల వివేక హీనునకు ♦ నెంచతరంబె రమా మనోహరా. 70

ఉ. పేదతనంబుచేత పసి ♦ బిడ్డలబాధను జూడలేక తా
నీదరిజేరి వేడ ధరం ♦ ణీసురుడైన కుచేల భక్తునిన్

వేదయజూచి సంపదలు ♦ వేడ్కనొసంగవె మైత్రిచేతదా
మోదరనమ్మినాడనిను ♦ మోక్షమునిమ్ము రమా మనోహరా. 71

ఉ. బాలురులేని గేహమును ♦ పండితమాధురిలేని కైతమున్
శీలములేని కాంతయును ♦ శ్రీహరివేడని వాని జన్మమున్
తాళములేని గీతమును ♦ తత్వమెరుంగని వాని జ్ఞానమిం
కేలను రక్కసారి భువ ♦ నేశ మురారి రమా మనోహరా. 72

ఉ. కాయము నిత్యమంచు తమ ♦ కన్నులు గానక పెక్కులెన్నియో
మాయలునేర్చి పాపముల ♦ మానసనల్పెడు మూర్ఖచిత్తులన్
వేయుము నీదు చక్రమున ♦ ప్రేమనినున్ స్మరియించుభక్తులన్
బాయగబోకుమంచు నిను ♦ ప్రార్థనజేతు రమా మనోహరా. 73

ఉ. ఆరయలోకమందు జను ♦ లందరు దారినిగాననిట్టి సం
సారసముద్రమందుబడి ♦ సన్నుతిసేయగలేక నిన్ను వ్యా
పారములందుగే బవలు ♦ భక్తినిజూపుచునున్న మృత్యువున్
బారికిజిక్కినంతనిను ♦ ప్రార్థనజేసిన మోక్షమబ్బదే

వారిరుహాక్ష చక్రధర వామనమూర్తి రమామనోహరా.

చ. పగలునవిత్తమందు పర ♦ భామలపై నిసియందు మోహమున్
దగిలి మదాంధులై యముని ♦ దండన పాల్పడుచుండ్రుగా దెనిన్
మిగుల స్మరింపజాలకను ♦ మేదినిగల్గిన మూఢులెల్లరున్
ఖగధర శౌరి మాధవ జ ♦ నార్దనమూర్తి రమా మనోహరా. 75

చ. పరులకు జిక్కకుండగను ♦ పక్షిభుజంబున నెక్కియుండినన్
దరికిని జేరవత్తురని ♦ దారుణ సర్పమునందు బండినన్
గురుతరమాయ నడ్డముగ ♦ గొల్పియు నీవెటు దాగియుండినన్
చోరవగు భక్తులెందులకు ♦ సుంతయు జంకక నీదువెంబడిన్
పరుగిడివచ్చిడాయుదురు ♦ బాయకునిన్ను రమా మనోహరా.76

చ. నిరతము నీదు పాదముల ♦ నెమ్మదినమ్మి భజించుచుందునన్
పరుడనటంచు నెంచకుము ♦ భక్తుడ నేనొకవేళ మూఢతన్
దురితములందు నూటికిని ♦ తొంబదితొమ్మిది జేసియుండినన్
కరుణ క్షమింపుమయ్యనను ♦ కాంచనచేల రమా మనోహరా.77

ఉ: రావణవైరి భక్తజన ♦ రక్షకశౌరి మురారి శ్రీహరీ
పూవిలుకాని తండ్రిరఘు ♦ భూపపవిత్ర విశాలనేత్ర ధా
త్రీవరసత్కృపాకర సు ♦ ధీర పరాత్పర సోమసుందరా
శ్రీవరశత్రునాశకర ♦ శ్రీగిరిధీర రమా మనోహరా. 78

ఉ. పుట్టుటగిట్టుటల్సకల ♦ భూతములందున గల్గియుండగా
కట్టధనంబు కాసపడి ♦ కానిపనుల్గ జేసి కాలుడుకొ
బెట్టెడి బాధలొందుదురు ♦ ప్రీతిని జేయరు నీదుచింతనం
బొట్టెడి స్వప్నమందయిన ♦ నోపికతోడ రమా మనోహరా. 79

ఉ. నీదగునామమెల్లప్రుడు ♦ నిశ్చలభక్తిస్మరించు వారి దా
మోదర ప్రేమజూచి వడి ♦ మోక్షమొసంగెదు కర్తవంచు నీ
వేదయజూతువంచు నిను ♦ వేడుచునుంటిని సర్వకాలమున్
నీదరిజేర్చి మోక్షమిదు ♦ నీరజనేత్ర రమామనోహరా. 80

ఉ. వాలినిజంపి నాదయిన ♦ బాధనువోవగ జేయుదుంచు నా
వాలి సహోదరుండునగు ♦ వానరముఖ్యుడు సూర్యసూతితా

గోలను బెట్టవేగమొక ♦ కోలనుగూల్పవె వాలి, భక్తునిన్
జాలినిగావలేదె వన ♦ జాక్షకృపాళు రమామనోహరా. 81

ఉ. వామనమూర్తిగాడుకడు ♦ వైరిమురారి సుమాయటంచు తా
నామెయిజెప్పగా వినక ♦ యాబలిదానమొసంగు వేళలన్
గోమలిధారవోయునెడ ♦ కూళతనంబున శుక్రుడడ్డమున్
తామసమూని రాగనొక ♦ దర్భనునాతని కన్నులొట్టగా
ధీమతిజేసినట్టి వసు ♦ దేశ మురారి రమామనోహరా. 82

ఉ. పాండవపక్షపాతివిను ♦ ప్రార్థనజేసిన గావరావు నీ
యండను జేరుభక్తులను ♦ నాదరణంబున జూడకున్నచో
నండజవాహనాయెవరు ♦ నార్తిని బాపుదు రీవుదక్క వే
రుండగబోరు దైవములు ♦ యోచనజేయ రమామనోహరా. 83

ఉ. శ్రీరఘురామ దుష్టజన ♦ శిక్షకమాధవ పద్మనాభ బృం
దారకపక్షపాతి ఘన ♦ తాటకమర్దన రాక్షసాంతకా

కారుణికోత్తమమూర్తి హరి ♦ కాంచనచేలసుభక్తరక్షణా
భూరమణీమనోహరుడ ♦ భోగిశయాన రమామనోహరా. 84

ఉ. పామరుడైన గాని ఘన ♦ పండితుడైననుగాని మిక్కిలిన్
ధీమతియుద్ధము న్సలుపు ♦ తెంపరిగానీ మరెవ్వరైన నీ
నామముదల్వబోకరవి ♦ నందను దూతల జూచి నంతనే
రామనియెద్వవీడుదురె ♦ రాఘవశౌరిరమామనోహరా. 85

ఉ. ఓపరమాత్మ రక్కసుల ♦ నుక్కడగించి జయించినావొ యా
కోపముబూనిచిత్తమున ♦ కుత్సితబుద్ధులు గల్గువారలన్
బాపపు వృత్తిచే సుజన ♦ పంక్తిని బాధల పెట్టుదుష్టులన్
బాపుమువారిజాక్షధర ♦ పాలకశౌరి రమామనోహరా.

ఉ. సంతతిగల్గసాకుటకు ♦ సంపదయుండదు సంపదున్నచో
సంతతి సున్నయానుమరి ♦ సంతతి సంపదగల్ల సౌఖ్యమా
వంతయునుండబోదు భువి ♦ సౌఖ్యముగల్గిన నీదుచింతనం
బెంతయు నుండబోదు మరి ♦ వేలనునవ్వి రమామనోహరా.87

ఉ. రాముని నామమే మనల ♦ రక్షణ జేయునటంచు నెంచి నీ
నామము మానసంబునను ♦ నమ్మి సదా నినుగొల్చు భక్తులన్
ప్రేమము మీరజూచి తవ ♦ బిడ్డలభంగిని గావు మాపరం
ధాముడ యార్తరక్షక గ ♦ దాధర శౌరి రమా మనోహరా

చ. ఘనమగు తాటకిన్దునుమ ♦ గాగల దైవము నీవెయంచు తా.
మనమున నెంచి జంపుమని ♦ మౌనియొకప్పుడు వేడ సత్వరన్
గనుగొని నీదు బాణమున ♦ కంఠము ద్రుంచవె బాహుశక్తితో
వనరుహనేత్ర దైత్యకుల ♦ వైరి మురారి రమా మనోహరా. 98

చ. మడుగున నొక్క పన్నగము ♦ మర్త్యుల నెల్లర మ్రింగుచుండగన్
గడగడలాడి నీదరిని ♦ గావుమటంచును మొఱ్ఱవెట్టినన్
వడిజని దుష్టసర్పమును ♦ బాలుడవయ్యును ద్రొక్కి గర్వమున్
గడపితిగాదె చక్రధర ♦ కేశవ శౌరి రమా మనోహరా. 90

చ. ధనమున కాన జెంది కడు ♦ దారుణకృత్యము లెల్ల సల్పివే
జనియును కూటసాక్ష్యముల ♦ జంకక జెప్పుచు విత్తమార్జన

ఘనమని జేయువారయిన ♦ గాతువునిన్ స్మరియించినంతనే
వనగుహానేత్రసోకులకు ♦ వైరి మురారి రమా మనోహరా. 91

చ. జలకములాడగా మనము ♦ సంతసమందియు సత్వరంబునన్
కొలకునజేరి గోపికలు ♦ కోకలవీడియు క్రీడసల్ప నా
పొలతులవస్త్రము ల్గొనుచు ♦ పొన్నని కుంజముపైన నుండినిన్
దలచిన ప్రేమనిచ్చితివి ♦ తండ్రిమురారి రమామనోహరా. 92

చ. కనుగొనసత్తపోధనుల ♦ కన్న కుచేలునకన్న భక్తులా
సనకసనందనాది ఋషి ♦ సత్తములెల్లరికన్న నిత్యమున్
మనమున పూజసల్పు పవ ♦ మానజుకన్న త్వదీయమైనమా
యనుగనశక్తి జాలునె ద ♦ యాకరశౌరి రమామనోహరా. 93

చ. నినుస్మరియింపగా మనము ♦ నిశ్చలమందుట పూర్వజన్మలో
నొనరిచినట్టి పుణ్యమన ♦ నొప్పనుగా నెటులైన దుష్టులో
మనుజులజేరి నిన్ను తమ ♦ మానసమందు దలంపవేడినన్
వినరుగ నద్దియున్ వృధయె ♦ విష్ణుమురారి రమామనోహరా. 94

చ. హరిచరితంబునందు నిసు ♦ మంతయు బుద్ధిని లేక ఘోరమౌ
దురితములెల్ల సల్పి యమ ♦ దూతల బారికి జిక్కినంత నే
మరణముజెంది యచ్చటను ♦ మానసమందున నిన్ను మిక్కిలిన్
స్మరణను జేయమైతిమని ♦ చాలదలంత్రు రమామనోహరా. 95

చ. అరయఁగలోక మందు జను ♦ లందరు నీదు మహాత్మ్యమంత తా
మెరిగితి మంచు నేర్వకయె ♦ నేవిధినైనను నిన్ స్మరించెదున్
నరులనుజూచి వ్యర్థముగ ♦ నవ్వుచు నెప్పుడు వారితోడ మే
సరికము లాడుచుండ్రు కరు ♦ ణాకర శౌరి రమామనోహరా. 96

ఉ. జీవులనేన సృష్టి నిల ♦ జేతునటంచును ధాతగర్వియై
తావడి నీమహాత్మ్యమును ♦ దార్ఢ్యమునన్ దెలియంగలేక నీ
గోవులదాయగా నెరిగి ♦ గోవులుబాలకులెల్ల నీవెయై
శ్రీవరబ్రహ్మ గర్వమును ♦ జెండగ లేద రమామనోహరా. 97

చ. జగములకెల్ల వేల్పువని ♦ చాలగనమ్మియు నిన్ను భక్తిచే
పగలును రాత్రి చిత్తమెడ ♦ బాయని మేనులకోర్కె దీర్పగా

మగటిమిజూపి రక్కసుల ♦ మారణ హోమము జేసినట్టియో
ఖగపతి వాహనాకరుణ ♦ గావుము నన్ను రమామనోహరా. 98
ఉ. ఔర యిదేమి మోస మహా ♦ హాయికయేమనవచ్చు భక్త సం
సారములెల్ల బీదవయి ♦ సారములేక కృశించుచుండ నీ
పేరును దల్వ కెంతయు ను ♦ పేక్షను జేసెడివారి కెక్కుడుర్
గౌరవ మొప్పగా ధనము ♦ కల్గ జేతువు న్యాయమావడిర్
కూరిమిజూపి భక్తులకు ♦ కోరికలీయు రమామనోహరా. 99
ఉ. వందనమాది దేవసుర ♦ వందిత పావననామరామ యా
నంద సురూపభానుకుల ♦ నందనయాశ్రితకల్ప భూజమా
సుందరమోము సోముడవ ♦ సుందరజాత హృదాబ్జవాసి నా
డెందమునందు నిల్పెద హ ♦ రీ దరిజేర్చు రమామనోహరా. 100
ఉ. ఎవ్వనిపాదసేవకయి ♦ నెల్లరు చింతన జేయుచుందురో
యెవ్వని నామకీర్తనము ♦ నెంతయు జేయగముక్తి గల్గునో
యెవ్వని సత్కథల్ వినగ ♦ నీప్సితముల్ నెరవేరుచుండునో
యవ్వసు ధేశుడీవెగద ♦ యార్తశరణ్య రమామనోహరా. 101

చ. తనువు లశాశ్వతంబులగు ♦ ధారుణియందున మంచి చెడ్డలే
ఘనమగు పేరుదెచ్చునను ♦ కావ్యముచేతను నిట్టికబ్బమున్
పనిగొని వ్రాసినాడనయ ♦ భక్తియు ముక్తియు గల్గునంచు నే
ననుకొని శౌరి మాధవద ♦ యాకరమూర్తి రమామనోహరా. 102

క. నీదగు భక్తజాలముల ♦ నేకడు బాముల పెట్టుడంచు నీ
మీదను లోకులెల్లరను ♦ మేదినినిందను మోపునట్టులన్
నాదరిజూప నోర్వగల ♦ నాకడు మూర్ఖుడ శక్తిహీనుడన్
నీదయజూపిగావుమవ ♦ నిర్ణ నిరతంబు రమామనోహరా. 103

ఉ. శ్రీరమణీ మనోహరుని ♦ చిత్తమునందున నమ్మినారికే
దూరము బోవు నాపదలు ♦ దుష్టులు భీతిని జెందుచుందురా
మారుతిపాగుదున్నయుడు ♦ మాయజయించిన దైత్యబాలుడన్
వీరలు సాక్షిగాదె కన ♦ వేరిక నేల రమామనోహరా. 104

చ. శతకము నవ్విధంబునను ♦ శాస్త్ర విరుద్ధము గాకయుండనే
నితరుల సాయముంగనక ♦ నేవిధి జెప్పుదు నిట్టికైతనా

కఠినభరమంచు మానసము ♦ నందున నెంచియు నీదుభక్తిచే
క్షితినిటుగూర్చియుంటి సుర ♦ సేవితపాద రమామనోహరా. 105

చ. మనమున నీదు చింతనము ♦ మానిపదంపడి రే బవళ్లు పై
ధనము గడించుటల్మహిని ♦ దారసుతాదుల సౌఖ్యమొందుటల్
పనులని యెంచి నంత్యమున ♦ బాధలజెందుచు నారకంబునన్
వనరుహనేత్ర చింతిలిన ♦ వచ్చునె ముక్తి రమామనోహరా. 10

ఉ. శ్రీయుతమై తెలంగుపాడి ♦ చేటుకులోద్భవు నారశింహముల్
శ్రీయమెలర్పనారసమ ♦ జేకొనిగాంచెను నొక్కపుత్రు నా
గాయణరావు నాభువిని ♦ రాజిలువాడ జడుండభక్తిచే
నీయదివ్రాసి యర్పణము ♦ నిచ్చితిగావు రమామనోహరా. 107

చ. సతతము భక్తితోడనిది ♦ శ్రద్ధను పూర్తియొనర్చినాడ నీ
శతకము నెవ్వరైన భువి ♦ సంతస మొప్ప పఠించువారలున్
మతిదిర మొప్పగా వినిన ♦ మానవులున్ దురితాళి దూరులై
యతులితసౌఖ్యముల్గనగ ♦ నర్పణ జేతు రమా మనోహరా. 108

